సరిగా నూరేండ్ల క్రితం ఈనాడే—మే 10, 1857–భారతీయులు ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామభేరి మ్రోగించినారు. సిపాయీల తిరుగుబాటని ఆంగ్ల చరిత్రకారులు దానిని త్రోసివేసినారు. కాని నిజానికది తొలి స్వాతంత్ర్య సమరమే–దేశమంతటా ఆ స్వాతంత్ర్య సమర శతవార్షికోత్సవాలు జరుపుకొంటున్న తరుణమున ఈ చిన్ని కావ్యాన్ని ఆంధ్ర జనానీకాని కందచేయడం మా భాగ్య విశేషము. ఇట్టి సదవకాశం కల్పించిన "సరస్వతీ పుత్ర", "మహాకవి" శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులు గారికి ఆదర్శ సాహిత్యమాలల పక్షాన కృతజ్ఞతాంజలులు.

ఇది మా సాహిత్యమాలల ఏడవ కుసుమము. ఎందరో సాహిత్యాభిమానుల ఆదరంతో ముందుకు సాగుతున్నాము. సాహిత్యమాల సభ్యులకు, విరాళ దాతలకు మా హార్దిక ధన్యవాదాలు.

ఇరవదై ఏండ్ల క్రితమే రచింపబడిన ఈ "సిపాయి పితూరి"ని వెలువరించుటకు మమ్ముల ప్రోత్సహించి మాకన్ని విధాల తోడ్పడిన మిత్రులు, సారస్వత ప్రియులు అగు, శ్రీమాన్ *U. S.* సందూర్ గారికి మేమెంతో ఋణపడినాము.

ఈ కావ్యం సర్వజనాదరణను పొందగలదని ఆశిస్తున్నాము.

ఆదర్శ సాహిత్యమాల,
హైదరాబాదు,
మే 10, 1957.

ఇట్లు
ఉరుపుటూరి రాఘవాచార్యులు,
కార్యదర్శి.

నిలిచి బసవేశ్వరుండు ఖణిల్లుమనుచు
అంకె వేయుటలేదు నిశ్శంకరీతి

మణులూడి కాంతులు మాసి మూల్గెడు షాజ
హానుని రత్న సింహాసనంబు
గడచిన కతల నేకాంతంబులోఁ బాడి
తనలోనె కుములు ముంతాజు మహాలు
పారాకటార్ల నిబ్బరపుఁ గాంతులఁ దాన
మాడనియట్టి దేవాలయములు
జయలక్ష్మి యిడుపదచ్ఛాయలతోడఁ బు
లకలుఁ బూసనట్టి క్రొత్తశపు గుంపు
భాగ్యలక్ష్ముల లాస్యసంపదలు దప్పి
గర్భదారిద్ర్యమున శాంతిఁగనని యిండ్లు
వట్టిపోయిన గోవయ్యో వసుధ- యింక
మిగిలినది యేమి! దుఃఖసమ్మితులకొరకు !

దొరల పెత్తనమున దేశమరసినారొ !
విగత తోషంబు బ్రదుకు భావించినారొ !
కములు దుఃఖాన యెడఁదలు గడ్డకట్టి
శిలలు గాలేదొ ! నరులుగా నిలచినారొ !

ఎన్నని పెళ్ళఁబోతు నెరి
యించెడు వార్తలు సూట్లు వేలు ! రా
నున్నది భాగ్యపంక్తి ! విజ
యోత్సవ మున్నది ముందు ! పీటుపై
వెన్నులు సూపకే ! పడగ
విచ్చిన కత్తులు దూసి వానిరా
కొన్న మృగేంద్రులై దొరల
గుండెలపైననె సానఁదీర్పఁడీ ॥

తలముగాకుండ నల్లజాతులనె చంపి
క్రొత్తరక్తముఁ గ్రోలంగఁ గోరుచున్న
విపుడు గత్తులు సైనికులెంతదీట్టు
రెట్లు దీర్తురో ! జగము వీక్షించుగాఁత

అని పచరించులోన మరి
యన్యుఁడు నిర్భర ప్రాప్యషేణ్యదు
ర్దిన సముపాత్త కౌతుక వ
రీత ఘనాఘన గర్జితంబుగా
ననె "సభయాలకించిన దొ
యాడిన మాటలు ! సమ్మతింపఁ గూ

దనిపని పల్కువాఁడు గలఁ
    డా! యొకఁడైన సిపాయిగుంపునన్"

"లేమిలేద"న్న పదము నిఘంటువుగు. ము
పాసుపోలికఁ బంది యుంటిపేము దాకె
మిణుగురులఁ గ్రమ్ముచున్నట్టి కనులతోడఁ
గూరుచున్న సిపాయీలగుంపునుండి

ఆ కష్టములొకతల నిం
కే కష్టంబొక్కటెత్తు నిటు సూడుఁడు! బా
పాకరులగు దొరలకు మత
మా! కావలసె! దెగఁబడుచు మంటను గలపన్.

సంపదలెత్తినారు నవ
    జాతుల రత్నములెత్తినారు నై
లింప విభూతి శోభిలు ధ
    రిత్రిని వీడుగ నొత్తినారు నె
య్యంపు వచస్సులాడి ధర
    తావని ధాన్యము విత్తినారు లై

ముంపఁగఁ బూనినారు మత
మున్ మనపాలిటి భాగ్యశేషమున్

వ్యాపారంబని సొద్దుపెట్టికొని య
న్నాకాంక్షులై నాలుగున్
కూపారంబులు దాటి పైఁబడి మతి
జ్ఞుల్గాని రాజన్యు "లే
మో పోనిమ్మను" భంగినక్క వినయం
బుల్నూపి కౌటిల్య లీ
లాపాశంబులఁ గట్టినారు ధరయె
ల్లన్నాంగ్లు లాత్మంభరుల్

గర్వదారిద్ర్యమునఁ జిక్కి కలఁగుచున్నఁ
దలఁపలేదు మనస్సుల మలపఁలేదు
శాంతిదీపంబు మనము దుర్జాతి దొరలు
ధర్మసేతువుఁ గూల్చ సిద్ధపడుపరకు.

అదియునుఁ బ్రాప్తించినది
య్యదనున నిక నూరుకుండనౌనా । పరదు

ర్భిదమగు దోర్వీర్యంబున
నెదిరించి పరంగి వారికెదలు దఱుగకన్.

వారు తోటాలకును( బూసి పందిక్రొవ్వు
ముట్టికొమ్మంద్రు మనల నామూలచూడ
మపఘనము మంటపెట్టిన యట్టు లౌను
వీనులను( బడినంత నావేడిపలుకు.

బ్రదుకుచెడి బానిసలెవ్వైన భావములకు
మనికిపట్టైన యట్టిది మనసులేదొ ।
బానిస మనస్సులకు భావ బలములేదొ ।
వాని భావంబులొకపైపు బ్రదుకరాదొ ।।

బాహాస్ఫాలన మాచరించి బల గ
ర్వంబాత్మ( దీంద్రింప న
ల్లాహోయక్బ రటన్న గర్జలు దిశా
ప్రారంభములోన్నెక ను
త్సాహావేశతదూకి శాత్రవుల మం
దల్ గ్రొచ్చి గోరాడు మీ

రా! హుంకారము పీచి గొ[్రె]లయినా
    రా! కాలజాలంబునస్.

కెరలి జయేందిరాశ్రవణ
    కీలిత కుండల కాంతిపుంజరే
సరసులమున్గి నక్కవి ప్ర
    శంసలఁ దానములాపి కాలమం
దరుగక నిల్చియుండిన మ
    హాత్ముల నక్బరు షాజహాను నౌ
క్కరవఁదలంపుఁడీ! మొదలఁ
    గ్రాచవా! జిక్కని పేడియూరుపుల్.

వారలు తాతలై మన క
    వక్రపరాక్రమ దిగ్ఘోర హుం
కారము లూతలై మనకు
    ఖడ్గలగ న్నవచిక్కణాస్త్ర శృం
గారపుఁ బూఁతలై మనకు
    కక్కసపుం బ్రదుకిచ్చగించి యి
య్యారడి పొట్టలోమికొను
    టా! మరి సిగ్గులచేటు దప్పునే!!

ఊరటఁ బంచెనంట హుమ
యూనొకసారి సుతుండుగల్గఁ గ
స్తూరిని సార్వభౌముడయి
సూనుఁడు ధారుణి నేతఁ గీర్తి క
స్తూరిని నించి దిక్కులకు
శూరులు నా మనుమండ్రు గీర్తి క
స్తూరిని నింత్రుగాత రిపు
సూదన చండశౌర్యప్రశౌండులై॥

ఎల్లిరానుండెఁగలను మీరెట్లు మనుమ
పట్టి మాకెదరో ! జూడపలెను నుందు
బ్రాణముండినచోఁ బట్టువదలరాదు
బరుగులిడరాదు బాధ దీల్పడఁగ రాదు.

ప్రాణము దూలపడ్డని స
లామొనరించెడువాని యుద్ధమున్
మాని తొలంగువాని సప
మానముకొగ్గి తృణంబునోటిలోఁ
బూనినవానిఁ జేయడి ద
ముస్ ధరవ్రేసినవానిఁ జంపి "మ

క్నా" నగరాననున్న, బయి
గంబరునాత్మకు నొవ్వుదేకుఁడీ !!

హైందవులందురా ! మనకు
నన్నలు దమ్ములు స్వర్గసౌఖ్య ని
ష్యందినిఁయైన భారత మ
హాస్థలి యిర్వురఁ గన్నతల్లి యే
కొందలపాటుమాని, తిని
కూర్చొనలేక పరస్పరంబు గ
చ్ఛం దములోనఁ బోరిరి వ
శీకృత చిత్తులు క్రోధపహ్నికిన్.

ఉన్నది చూపుమేరకు స
మూర్జిత దేశము బ్రోచుబానఁ గై
కొన్నది భూమి మాత దన
కోటి కరంబులఁ గూడుపెట్టి దీ
వ్యన్నయ నాభిరామములు
బారుచునుండె నదీనదంబు లే
మున్నది లోటు ! పాళ్ళు సరి
పోవక యిర్వురు గ్రుమ్ములాడఁగన్.

ఇది నారాజ్యము. ఇద్ది పేరనుచు
　　నెన్నే పేళ్ళ గల్పించి సో
మ్మదులై గత్తులుదూసి రక్తనదులన్
　　దాసంబు గావింత్రు బు
ద్ధివరిప్రాణుల గుంపుగట్టికొని యే
　　దీ శాంతి। సర్వాంగ సం
పద శోభిల్లెడు దల్లిగద్గె యనుమా
　　నాధీన దేశంబునన్.

ఎవరు బరాయివారలని
　　యీ కసి। యెన్నితరాలనుండో యీ
యవనినె నిర్చినారలు మ
　　హమ్మదు జాతులు వారలన్యులా।
యవనులకన్న ముందె నిట
　　నార్యులు చొచ్చిరి వారలన్యులా।
దవిలి సుఖించి రప్పటికె
　　దస్యులు నీ ధువి వారలన్యులా॥

యావన భూమిబుట్టి యిట
　　నంటితి రీతె బరాయివారటం

చావల హైందవుల్బలుచ
నాడగ నీవల "మధ్యయేషియా"
త్రోవల నుందివచ్చి యిట
దూరిన వారలు మేమెయంచుఁ గ
న్గ్రీవలతోడ మేము గిక
రింపఁగ వాదుల కంతుజిక్కునే ॥

ఎవ్వరో వచ్చినారు గతి
యించిరి వచ్చినవారలెద్దొ యా
యవ్వల గాథలన్నిటికి
నాయువు వోయునఁ బ్రాణమిచ్చి, పెన్
గ్రొవ్వున "మీరు- మేము" నుచుఁ
గూడని భేదములేర్చి కుత్తుకల్
ద్రెవ్వికొనంగ బుద్ధిగల
దే: మనుజత్వము సూచినవ్వదే ॥

ఈ పగ నందపెట్టికొని
యిర్వురి మధ్యనుఁజేరి తీపుల

న్జూపుచు దుర్వ్యవహారములు
      నూపి మనస్సులు రెచ్చఁగొట్టి యీ
పాపులు యుద్ధముత్కలికి
      వారికి వీరికి లంకెపెట్టి సౌ
ఖ్యాపహులై ధరావలయ
      మంతయు దోచిరి నిష్కళంబుగన్.

ఇరుదెగలకుఁ గలహంబునఁ
బొరసిన బరమార్థమేమి! పుష్కల సంప
ద్భరితము దేశము దృష్టా
కరులగు నాతెల్లదొరలఁ గైవసమయ్యెన్.

అయినతోడనె సకలభాగ్యముల తోడఁ
బొలుపునించెను భారత భూమియందు
ముప్పదియు మూడుకోట్ల గొంతులు నదించె
నమితవేదన "నన్నమో! యన్న" మనుచు.

నాటంగోలెను నొక్కటేనినద మ
      న్నా! వేయి సంద్రాల కు
న్నదిపై మ్రోగుచునున్న దిక్కరణి నాం
      దీతోడనే యేడుపుం

బాటల్నేర్పిరి దెల్లవారు మన క
ల్పా నల్ప పాత్రంబు లు
ద్ఘాటింపన్ బడె "పచ్చిపోయె"నని తే
దా గీతి మార్పింతయున్.

ప్రాతవడినట్టి పాటయే పాడిపాడి
యెన్ని వత్సరములు గ్రమియింపఁ గలదు
కాల మార్దంగికుండు "తేహా"ను వేసి
యరసెఁ గ్రొత్తని పాటొక టందుకొనుఁడు.

కడుపునకుఁగాని యట్టి గర్భానను విషువుఁ
డిది మనది భూమి మనమున్న హిందువులును
ముస్లిములు జేరి యొకజాతి, మూటముల్లెఁ
గట్టికొని దొరగుంపు సాఁగవలె నిపుడె.

ఒకటియ ! రెండా ! గర్వా
ధికులు దొరలు సలిపినట్టి తెగువలు ననుకొ
న్న కొలఁది రుధిరము మేనునఁ
దెకతెక నుడుకెత్తు మనసు తీవరమెత్తున్.

పసఁడు పసంపు జాతి కర
    వాలములింకను ద్రుప్పుపట్టి తే
దదిగో! నదించుచున్నది ఆ
    యార్యపు స్వాగతగీతి నాకటన్
గదలిన గుండెలో నుదికి
    గ్రమ్మెడు గ్రక్కున మాధ్వతేదు వెం
ట దవిలి కోటి సూర్యులయి
    నన్ బయిగంబిటు తోడుబల్కెడున్.

సింగములట్లు దూకి కలి
    చిచ్చు విధంబునఁదాకి ప్రాకి సా
రంగ సమూహము నిర్ద్రుమ
    నట్టులు గాసన ఘూమిఁజుట్టి స
ర్వాంగ వినాశమున్నలుపు
    నట్టులు శత్రులఁ దున్మితూటి ఘూ
మిం గలుపంపుఁ గీర్తిఁ గని
    మింమిఁడి! దేశగతిన్ గ్రహించుడీ!!

అని పల్కినంతలోననె
వసధి చలిత చంగభంగ పటలివలెనెఁ గూ
ర్చొనిన సభనుండి గర్జా
నినదంబులు దెరలుతెరలు నింగికిలేచెన్.

ఘలుఘలు ఘల్లుఘల్లుమనెఁ
గత్తుల గుంపులు వాని పైన ప
చ్చలఁ గమిచెన్గరాలు సుమఁ
జూపులు నిప్పుల గుప్పళించె మూ
పులు బెరిఁగెన్ సమిద్ధ రస
మూర్తులు లేచిరి ప్రేటుదిన్న క్రో
ల్పులులయి సైనిక- ల్పచన
మూలసముద్ధత కోపనద్ధులై।

వేల్పువచ్చిన యట్టు లావేశమంది
నిలచికొన్న సిపాయీలఁ గలయఁజూచి
చేయివీచి కూర్చుండఁగఁ జేసి పల్కె
నగ్నిమన్మూర్తి యొక్కడు హైందవుండు.

కూరుచొనుఁడోయి। మీరేల గుతిలపడఁగ
వచ్చితిమి దగ్గఱకె। దెల్లవాఱునిందు
తడవులేదు పాశ్చాత్యుల దళమునెల్ల
నెగచి యెగ ద్రేసి నరకు బందుగదినంబు.

గోవులఁ గ్రొవ్వనఁ దోటా
లావటమొనరించి ముట్టమందురు దొరలిం
దేవాఁడు నొప్పఁజెందఁడొ ।
గావలమగు గార్యమునకుఁ గలిగినఁ జెపుఁడా ।

ఏతరిగాని హైందవుఁ డొ
    కింతయు భేదము నెన్నబోడు గో
మాతకు మాతకు న్దనదు
    మానసమందున నట్టిచోట దు
ర్జాతులు గోవులన్నరిమి
    చంపుటెగాక దదీయరక్తపుం
బూఁతలతోడి గుండ్ల గమి
    ముట్టుకొనుండని బల్కఁబాడియే ।

మనతోనె బుట్టి మనతో
డనె బెరిగెడు ముస్లిములె హఠాత్తుగఁ గ్రమణం
బొనరిచి గోవులఁ జంపినఁ
గనులు చెదరు మనకు మదులు కలకఁ దలఁకెఁడున్.

ట్టడచిన చందమయ్యెఁ దగు
నా ! యిది గాదని యాలసింపఁగన్.

హైందవులె రాజ్యమేలఁగ నర్హులనుచు
ముస్లిములె నాయకులు వీరపురుషులనుచు
మనము మనలోనె గలహించి మమతఁ ద్రుంచి
దొరల రప్పించి విభవంబు దఱిఁగినాము

నాలుగు జలధుల నవతలి
నేలఁబడినవారు నేలనేలినకంటెన్
బోలఁదొ ! మన వారేలిన
నేల గుతిలపడఁగ మనల నెవ్వరుఁగానీ ! !

హైందవులు నేలనైన మహమ్మదీయు
లవనిఁ బాలింపనైనఁ జీమంతగాని
లక్ష్మి భారతధరణి యెల్లలనుదాటి
యితర సీమకు వలసఁబోయినది లేదు.

తురకలె బాలింతురు వో
ధరణీ రాజ్యంబు ! వారి తలపై నిడుకొం

దురో ! యున్న సంపదంతయు
వెలివు విడిచి తమ్ముంటిమిఁ బ్రిటిషువారు.

సంపదలు దోచి పరదేశమునకు బరి
కెత్తి పోదురు ! యెట్లు జీవింపవచ్చు !
దొరలజాతికి అందనుకరణి వీరి
కాశ్రయం బైనదేశ మస్వంబులేదు.

కలిసికొనిరట వేలయేండ్లకు ముందుఁ
గలిసి జీవించిరట యొక్క ఖండమందు
ఉల్లముల నమ్మికొనిరట ! యొకరినొకరు
అహహా ! మన మనుజత్వ మేమనఁగవచ్చు !

జగతి బాలింపరే ! పాదుషాలు ముందు
వారి కాలంబులో హైందవాళి యెవరుఁ
దిని యెఱుంగదో ! గుడ్డగట్టినది లేదో !
చెలువమొలుకంగఁ దొడిఁగి పూసినది లేదో !

అక్కన్న మాదన్న లెక్కవచ్చినదేరి
ప్రాపుననతఁడు నవాబుగాఁడో !

తెలగనార్యునినైన మంకరించినదేది
ప్రాసున ! నతఁడు నవాబుగాఁడొ !
భద్రాద్రిరాము చేపడు మంత్రులనిచ్చి
పంపెమవాఁడు నవాబుగాఁడొ !
ఆ జగన్నాథు బ్రాహ్మణునిస్తుంది ఖా
షా బిస్థబుద్ధి నవాబుగాఁడొ !

వారుఁజేసి రోపినయంతనట్టు మేలు
చేయనే లేదుపో ! యెంతఁజేయకున్న
నా నమయమందు "నన్నమోయన్న" మనుచు
నిట్టికోదన ప్రజలలోఁ బుట్టలేదు.

చీని చీనాంబరములు గైసేయకున్న
నింపుమీర "గుల్కాసులు" భుజింపకున్న
యవన రాజ్యంబునందు హైందవుఁడె వండు
వస్తుబచి మేనువిడిచినవాఁడు లేఁడు.

అద్భుతములైన మన కళ లంతరింప
లేదు వారల సంస్కృతి శ్రీలఁబెనఁగి

క్రొత్తరూపునఁ బుడమిపై గోచరించె
జవనికలు బాసివచ్చు నచ్చరలపగిది.

వివిధభంగీ హస్తవిన్యాస హాసక
క్రమములైన యట్టి శిల్పములు పలుకు
ప్రాభాతవాత ఝంపా కంపితారవిం
దములు "తాన్సేను" గీతములు పలుకు
వ్రజభారతీ సుమాభరణంబు భావ పు
ల్లంబైన "రీతికాలంబు" పలుకు
మధుమాధురీ సమున్మదము లక్బరు వాశి
దాసుని శ్లోకసంతతులు పలుకు.

ఆ మహాయోగి "దారా" హృదంతరాళ
తలినిఁ గొలువున్న నుపనిషత్తులు వచించు
"యవన సంస్కృతి యిదిగోఁ బ్రత్యక్ష"మనుచు
నాత్మ యుండియు నెవఁడు "గాడ"నఁగఁ గలఁడు !

మరి యిపుడు జూతమా ! జాలి- మధుపుగారు
దేశమందెల్ల నాకలి దేబిరింపు

భవ్యమైనట్టి దేశసౌభాగ్య లక్ష్మి
పోయినది- పోవుచున్న దబ్ధులను దాటి

మన శిల్పసంపత్తిఁ గనులఁజూడఁగఁ గోర్కె
గూడ "లండను" బోయి చూడవలెనొ!
మన చరిత్రలఁ బాడు మహితశాసనపంక్తి
సీమకునేగి దర్శింపవలెనొ!
మన రత్నపంక్తిఁ జూడను సీమరాజు కి
రీటంబుకై జూపులెత్తవలెనొ!
మన షాజహాను సింహాసనంబు పరంగి
చీకటి గదుల మూర్ఛిల్లవలెనొ!

మన తలల రుద్దునట్టి శాసనములెల్ల
సీమదొర మెచ్చి దిగుమతి సేయవలెనొ!
చచ్చిచావని భరతదేశమున కింకఁ
గృపణులగు దొర లేమిమిగిల్చినారు!!

ఎన్నిదినములు ముస్లిముల్ హిందువులును
బులులు మేకల విధముగాఁ బొసఁగవేరొ!

అంతవరకును దొరల భాగ్యోపవనములు
మాసిపోఁబోవు - బ్రదుకులు - మసలి మనము :

తలఁపఁబోకుఁడు జీర్ణవస్త్రములఁ బోలె
వదలిపెట్టుఁడు భేదభావములు మీరు
భారతీయులింతవరకు హేమమావరించు
శతము లిగురించు దివ్యదేశంబు మనది.

యవనులు - హైందవులనెడు స
నవసరభేదముల నాత్మ నరిగణింపక. దే
శ విభవమార్చిన, నరపుం
గవుల మరచిపొందు చెడుఁగుఁ గలలను బోలెన్.

అడఁగక నిల్చియున్నది, మ
హమ్మదువంశపు సార్వభౌము ల
న్గడపటి దీపమొక్కటిజా
గారుచు, నిర్మల స్నేహవృత్తిచే
నుడుఁగక దానిజోపి భర
తోర్వికిఁ జూపుద మొక్క చంద్రునై

పడి సుడుపంక్తు లౌచుఁ బడి
వారసు నిల్పెను వెన్కఁ బ్రక్కలన్.

ఢిల్లి గద్దియనెక్కి యేలిరి గదా !
డిల్లోని శౌర్యంబు శో
భిల్లన్నా మొగలాయి పాదుషహా లు
ర్వీస్ మొన్నదా-కిప్పుడున్
జెల్లున్ వారికిఁ దత్ప్రభుత్వము సము
న్మేషత్ప్రభాశాలి హ
ర్షల్లో నుండయి యేలుగాత "బహాదూ
ర్షా" దొంటివారిన్ వలెన్.

అతనిఁ బరిపాలనంబులో నణఁగిమణఁగి
యందరు సుఖింతమాత్మలఁ గుందు దలఁగి
యింతకన్నను వేరొక్కటేది లేదు
బ్రదికి బట్టసుగట్టి భారతులకి పుడు.

దొరల కత్తులనీడ నాదరువులేక
నిలచియున్నాడు వేదనా నిభృతమూర్తి

పాదుషా ! దచ్చిరాస దీప్య చ్చిరత్న
రత్న జటిల కిరీటంబు గాలుఁగాఁత.

డిల్లీవప్రంబులు-బిం
పిల్లున్ గావృత సమగ్రవిజయానప గీ
తోల్లసిత గర్వములునై
ఘల్లుఘలా స్వనదమోఘ ఖడ్గచ్ఛటలై

తెలవాటినంతఁ గ్రోధో
జ్జ్వలితులునై-మారిమసఁగి చంపుఁడి-పాశ్చా
త్త్యులనెల్ల నన్యపీడన
కలుషితమగు రుధిరమవని కాలుపటాలన్

ఇదెకడమాట-యిద్దియొక రెవ్వ
రి గార్యముగాదు-అందరున్
గదిసి-గ్రహించి చేయవలె-ఖ
డ్గముతో విజయంబు గావలెన్
బ్రధితముగాఁగ నిల్పవలెఁ
బాదుషహా జిగీగద్దెయందు-సం

పద వెలయించి నిల్చినటె-
భారతమందున శాంతిదీపముల్

ఈ ప్రయత్నంబులోఁ జేరఁదెవ్వఁడేని
వాఁడు భారతమాతృగర్భంబు జెఱుపఁ
బుట్టువొందినయెడ్డి పెద్దపుండు-దేశ
చరితలో నొకద్రోహిగాఁ బరఁగఁగలఁడు.

కంకేళి కుసుమగుచ్ఛపుఁ
బొంకంబున నిలిచె సత్యముఁడు బడమట ద్రా
శంకురిత సైన్యకోపాఽఽ
శంకాఽఽతంక ప్రసంగచత్రృఘుఁడగుచున్

తద్దయునుఁ దబ్లియొరదాక దన్నికొన్న
జలముతోఁగూడికొన్న బావులనుబోలె
మచ్చరము బెచ్చుపెరిగిన మదుల బొదలఁ
దరలె శిబిరంబులకును యోధవ్రజంబు.

తెలవాఁటినఁదాము నిర
ర్గళముగ శత్రులవధించుఁ గల్పనముల-పి

చ్ఛిలదరహాసంబులతోఁ
దెలియకయే వీరతతికిఁ దెలతెలవారెన్

అరుణాక్షములు నిప్పులురలింపఁ గ్రోధహుం
కారంబు సేసెఁ బింకంబుఁ జూపి—
మరణదుందుభి మ్రోసె మాటిమాటికి ఘూక
నికరంపు రావు గొంతుకలయందు
మందమారుతకంత సందోహములనుండి
వినిపించెనొకటి గ్రొవ్వేఁడిమూల్గు
కౌతూహలమున రక్తాంబరంబున మోజు
పడియె నానాటి ప్రభాతలక్ష్మి

యెంతదాహంబు గమిచెనో యెదలఁ బృథ్వి
సంతతులు రక్తములనె వసంతమాడె
నాడు చిత్రమ్ము విశ్వమంతయునుఁ గూడ
రణము రణమని పెద్దయార్చినది పొంగి

కహకహానాదముల్ కదల
గ్రమ్మెను-దుర్ధరశౌర్యకీర్తిధూ

వ్యూహములు ఖడ్గముల్ మెఱసె
బారులుదారులు శ్వేతజాతిస
స్మూహసమొనర్చె సద్దఁగ ర
ణస్థలి కోయనియార్చి భారతుల్
గ్రుమిఱి ఘమాండమోసరిల
డాకిరిఁ డాకిరి శత్రుసైన్యముల్
కత్తికిఁగత్తి రాచుకొని
గ్గెడు నిప్పులజల్లు-నల్లను
ద్వత్తినిమూర్తపగ్గనిన
దించెడు వీరులత్రుళ్ళ త్రెళ్ళ రా
హుత్తులమేనుల న్దొఱఁగు
చుండెడి రక్తపుఁబెల్లు-బల్లెపుం
గుత్తుకలందు నాంత్రముల
గుంపులు-జిత్రములయ్యెనయ్యెడన్

గుదులుగుదులుగ పడిరి గగ్గోలుపడుచు
సైన్యములు మదబంధుర సామజములు
పడినరవుతులపై నడుగిడుచుఁ జనిరి
రక్తచందనభూషితో రక్క-భుజాలు

కారెడు రుధిరముతో-హుం
కారముతో-హస్తకలిత ఖడ్గముతో-నా
ప్పారె నొకభటుఁడు వర్ష
ద్ధారాగర్జాతటిల్లతాయుత ఘనమై

ఒక్కఁడు రక్తనేత్రుఁడు మ
రొక్కనిఁ గుత్తుకఁద్రొక్కి, నిక్కి పే
రుక్కున ఖడ్గధారలఁ గ
రుక్కునఁద్రుంచెడులోన వెన్కనేఁ
జెక్కె నొకండువచ్చి వను
చిందెను రక్తములోన మంజరీ
న్యక్కారణంబు-గ్రిందఁబడి
నాతఁడు కోయనిలేచి యార్వఁగన్

తలదునిసిన మొండెంబె గ
దలి తలచెడకపుడుకలనితలఁ బ్రతిపిడున్
దలకెడపిపడిమె ధరణి
తలిఁవలఁడనిఁ రెండు తలలుదలఁగక పొగడన్

పరుషగతివచ్చునట్టి దుపాకిగుండు
నార్చి హస్తంబుచేతనే యడచెనొకఁడు

దీపిరించిన రక్కొసతెగువఁజూచి
దొరలగుంపులు నివ్వెరబెరసినిలువ

ఒక సైనికునిగత్తి జెరచెక చిఱుమంట
లార్చె బింటనుద్రిప్పునట్టి కొరివి
ఒక బల్లెమూగి నదుయ్యాలపలెఁగ్రక్కు
కొని రక్తగరళంబు కోడెనాగు
ఒక తుపాకీనేత్రమురిమి చూచినది దె
ప్పరము దాహముగ్రమ్మి భద్రకాళి
ఒకవింటినారి పెల్లురిమెనాకలి రెమ్మి
తీడిరించిన మృత్యుదేవిధక్క

ఒక శవము దూగిపడియెఁ జేయునదిలేక
యొడలు జల్లెడయైఁ దడఁబడు సివంగి
సమరతలమెల్లనప్పుడు జయరమా వి
హారకేళికయ్యె నుయ్యాల తొట్లి

ఒక్క పరంగి వీరుతల
నుక్కునద్రుంప సిపాయి రక్తముల్
ద్రెక్కొనిచిందెఁ బశ్చిమపు
దిక్కున కాతనిదేశభక్తితో

నక్కజమంది మెచ్చెఁదల
        నార్చివిరోధి సూరంబుగ్గసర
జిక్కనిశత్రువైనసుతి
        సేయక తజ్ఞుడు మానసేర్పుడే ?

ఒకచోట గుడులుగా మరి
యొకచో బాడయిగ యోషలొలఁగిరి-మృగరా
జ్ఞికరములు ధరటియసు బోలఁ
తుక మేన ధరించునట్టి తొడవులగసుత్రై

కడుపుననుండి ప్రేవుల ని
        కాయము బాములవోలె ప్రేల నె
క్షుదురభసంబునన్ దురిమి
        కొంచునులోనికి మందుమూకి ప
చ్చెదునొకరౌతుఁ గాంచి యర
        చెన్ దొరభీతిలి-యార్పులేర్పుత్రై
యుడుపథమంటఁ దాండవము
        నూనిన మృత్యువుకాలిమువ్వలై

పసిరొక్కఁడో పిరంగులు గుత్తపుమొత్త
ములు రుహాపుల దూసిపోసినట్లు
చిందిల్లెనొకచోటఁ జిరిగిమేనులు మాంస
ఖండంబులవి పండఁదరిగినట్లు
తొరఁగెనొక్కట నెత్తుటిరచి క్రొవ్వేడి నె
త్తురులు దుత్తలతోడఁ దోడినట్లు
చెలఁగెనొక్కటి శిరంబుల గుంపుమోదు గుఁ
బూలు ధారుణిపైని రాలినట్లు

మృత్యుశైలూషి కిరుప్రక్కలెసఁగి జతుల
గతులు గొలిపించునట్టుప కాండ్రగుంపు
రెక్కలను దాళములు మ్రోచియక్కజముగ
గ్రద్దలాడినవప్పుడాకాశమందు

రణచండి నీలినోలందాడఁగన్నులఁ
దొరఁగివచ్చెడు మిణుంగురులువోలె
నియతిపైఁ గాలమనెడు బూరుషుఁడు వ్రేయు
జెలువు గన్నెరు పూచెండ్ల వోలె
మృత్యుదేవత జలక్రీడలాడఁగ వహ్ని
సరసిలో చల్లిన జల్లువోలె

కాలుని మహిషరింఖా ఖనిత్ర నిహతి
నిలనుండి యెగిరిన శిలలువోలె

చటుల నినదంబుతో దిశాపటలి యదరు
నువిదలకుఁ గర్ణయుగళంబు చెవుడుఁ గొనఁ,
దొరల సైన్యంబు లందుండి చెలఁగె నగ్గి
రాల్చికొని చేరెడేసి పిరంగిగుండ్లు.

ఆ యగ్నిగోళంబు లలమిచచ్చిరి బదిం
బదిగఁ బోరాడు సిపాయిగుంపు
లయిన వెన్కకుబోక యరిమి చంపిరి పరం
గీలను విక్రమకేళి మెరసి
నెత్తురు వట్టోడినెపడునుమారి వసు
గ్గడువుగా నిండె నప్పుడమి భూత
వేతాళములు నభోవీధి మస్తకపాత్ర
ములయందుఁ గ్రొవ్వేడి మూర్ఘనించి

కొని పలల ఖండముల నద్దికొనుచుఁ దినుచుఁ
జవులఁ బొగడుచు వేమారు చదలు గదల

వేయు "సాహో"స్వనంబు నిర్ఘోషము గుచు
నిండె జీవసంఘాతంబు గుండెలగల.

పరవడుండినచోఁ దోటుపడనివాఁడు
బడినపోటున కిలమీదఁ బడనివాఁడు
బడి బ్రదికినట్టి యాతఁడొక్కఁడును లేడు
ఆ రణస్థలి దొరల సైన్యంబునందు.

జయలక్ష్మి మెచ్చి యిచ్చునఁ జల్లినట్టి "బు
క్కాపు" పోలిక ధూళి కరము బెరసి
ప్రతివీర ఖడ్గధారాప్రణస్థగిత వ
క్షస్సులవేషి రక్తమ్ము లాలికి
కంఠాంత్ర మాలానికరవిభాప్రతి ఫల
నంబైన కబ్బెబ్బనగవు లెగసి
రణయజ్ఞ విక్రమారణులైనఁ గన్నుల
కొనల నెట్టిన మిణుంగురులు గ్రమ్మి

మొనసి భీకర రమణీయమూర్తులైన
భారతీయులు సైనిక ప్రవరు లప్పు

డార్చి "రల్లాహో యక్బర" టంచుఁ బలికి
పలుకునందున "మీరట్టు" బులకరింప.

ఎన్నిదినములు గడచెనో ! యింపుదొలఁకు
జయనినాదము భారతస్థలములు విని
పులకరించుచుఁ జెట్టుపుట్టలును గూడ
నా స్వనంబప్పు డరచిన యట్టులయ్యె.

పలికెనొకండు దోడనె సి
పాయిలఁగాంచి యసుంగులార ! నీ
తొలితటి తాకునందె జయ
తూర్యము మ్రోచితి- యింక భాగ్యల
క్ష్ములు మనదిక్కుకే దిరిగి
చూచిన యట్టులె- లేదు సందియం
బలమి ముగింతమీ కథ జ
యాంతముగా నవభారతోర్వికిన్.

రక్కెస నాట్యమాడుచుఁ బ
రంగి పతాకలు ఢిల్లికోటపై
నిక్కుచునుండ శాంతియన
నేటిది స్వప్నముగాక ! మార్తురన్.

త్రొక్కి పతాకలూన్చి జయ
సార్వభౌంరొపనమెల్ల పాదుషా
నక్కడ నిల్పి కత్తులఁ జి
రాయుధపు బోయక గస్నుమూతురే ।

అనిసమూటల "టపుటపు" ననెపువాటు
బలుమొగంబులఁ బులకరింపులను బయల
పేటువారనుఁ గత్తుల దూటువార
తెడురెరుంగని యూ సిపాయీల గములు.

శ్రమలేక దూకు గుఱ్ఱముల డెక్కలగుంపు
టకటక ధ్వనులఁ బాటలనువాడ
ప్రతిసైనికుని పట్టుపాగలోఁ గుచ్చులా
య్యారంబుగాఁగ నుయ్యాలలూఁగ
మిద్దెత్తుగాఁ దేజిమిగులు బల్లెపుబారు
లాసురంబుగ బయల్దూసి పోవ
తుములంబులైన గొంతులతోడఁ గేదెంబు
లావేశమున నవ్వినట్టులుండ

కదలిరి సిపాయిలెల్ల రాక్షణము వీరి
కహకహారావ నిర్ఘాత గగనులగుచు
ప్రళయ కాలమహోత్పాత భయదకోప
మగ్గలించిన ప్రమధనాయకులఁ బోలి.

నెట్టిన దూటుచు గేరలు
వెట్టుచు బయనించునట్టి వీరతతికిఁ జూ
పట్టె నెదుట యమునానది
గట్టని తోరణములు ఖగ గణములతోడన్.

ప్రకటిత కంకణముగఁ జకి
చకిత విసారీ విలాసచలనంబుగ సై
నిక నికరంబుల యమునయు
నకుటిల జయలక్ష్మివోలె నాహ్వానించెన్.

ఎవరు వచించిరో ! తెలియ
దింతటిలోననె వర్ధమాన క్రో
ధ వివశ హైందవాహవ క
థానిచయంబులు ఢిల్లికోటలో

బవరమొనర్పఁగా నెదురు
వచ్చెఁ బరంగుల గుంపు రోషభై
రవముగ నాల్కలార్చుచుఁ బి
రంగుల మొత్తము లాపులింపఁగన్.

అరచిరి తెల్లసైనికు ల
హంకృతితోచి కటారులార్చి యం
బర మగలంగబిట్టు బ్రతి
నాదము లిచ్చిరి నల్లజాతి వో
టరు లిరువాగులప్పుడు హు
టాహుటిఁదాకె సముత్తరంగ భీ
కరములు రెండు వార్ధులు "ము
ఖాముఖి" కోయనిఁ దాకినట్లుగన్.

అడగనియట్టి యారుపు
లహంకృతిగర్జలు గత్తులం జనిం
చిన మిణుగుర్లు ధారుణికి శీ
ర్ష చయంబులు దొల్లుశబ్దముల్



పనవెడు నేడ్పు లాక్రమిత
 బాధల మూల్గులు నంతరాళ స్థ
దనమొనరించు వహ్నిముఖ
 తండము నప్పటి దొమ్మిమూఁకలోన్.

చంపెనట్టి వాఁడెవ్వఁడో! చచ్చినట్టి
వాఁడెవఁడో! వేరుపరుపను వీలుగాదు
దారుణంబగు నాఁటి సందడిని జంపి
నట్లునున్ మరి జచ్చినయట్లుఁ దోచె.

కత్తులువీచి రక్తముల
 కాంతుల బిమ్మిటినొంది వెన్కకు
న్నొత్తికొనంగదిక్కులు న
 ముద్ధతమైన సిపాయిగుంపు గొం
తెత్తి నదించె "దక్కె మన
 కే! విజయం"బని క్రేళ్ళుదాటె ను
ద్వృత్త హయంబులప్డు సకి
 లింతలలో జయభేరులార్వగన్.



కనుపించె నెచటనే హ
స్తినాపురము- దాస్యప్రవృత్తి దీనము- గనుపిం
చినవచ్చుట బహాదూర్షా
వినయమిత వదనంబు విగతవిభవోద్ధతిమై.

అలస సమీర సంగతి ల
యల్పపరించుచుఁ బారతంత్ర్య గీ
తుల పతియించుచున్నది మ
దోద్ధత మాంగ్ల పతాక ఢిల్లికో
టలపయి దాని గగ్గాని హూ
టాహుటి దూచె సిపాయిగుంపు ల
గ్గలముగఁ గ్రోధమూచికొని
కన్నులు చంద్రలఁ బోలుచుండఁగన్.

ఎదురుపడెన్నరంగి బల
మింతటిలోననఁ దానిఁజూచి బె
ట్టిదముగనార్చి తాకిరి తో
డిందొడి భారతవీరులయ్యె వ

య్యదసుస మూకయుద్ధ ముప
 హారితరక్త వసావిసారి మాం
సద మదమత్త భూత పరి
 సర్పితవేల్ల "దహో"నినాదమై.

అడచిపడెడు దొరగుంపులు
బడె వసుధాతలిని వీరభారత తతిచే
యడిదములఁ దూలి కాలను
జడిసి ధరంబడిన పలుదుపాసులు వోలెన్.

పడిన పరంగి మొండెముల
 పైననె దూకుచు మూఁక లారసం
బడలఁగ గోలపెట్టుచు జ
 యాసవమత్తులు చేరిరప్డు మైఁ
దొరుకుచున్న వార్ధకము
 తో నిజఖడ్గము నైనఁ బట్టఁగాఁ
దడఁబడుచున్న యట్టి సుల
 తాను హజారపు లోదువారమున్.

చేరినతోడనెఁ బెల్లుఁగ
నారిచి రల్లాహొయక్బరని పోటరు లా
స్ఫారతర నాదమమృతమె
జారించినదపుడు మునలిప్రభుపుచెవులలోన్.

పలికెను వెంటనే యొకఁడు
బాదుషహా దిలకించి భక్తి పి
చ్చిలమతి రాచవారు దయ
సేయుఁడు బిల్చుచున్న దప్రపుం
దళుకులగద్దె నిల్చె భర
తావని దొంటివిధాన మీతల
న్నిలుపుటకైఁ గిరీటము మ
షీగణ నిర్మలకాంతి నవ్వఁగన్.

ఎన్నియేడులుగా నెదనింకియున్న
దేశభక్తి హఠాత్తుఁగాఁ దీడిరించె
నో! మొగలు సార్వభౌమున కుబికికొనియె
గన్నులన్నీరు పులకభంగములు మేన.

క్రమమునఁ బూర్వవైభవ ని
కాయ మపాయము జెంది కాంతివి

శ్రమమయి జీర్ణదేహమునఁ
        జావక లేవకయున్న యాత్మ పం
శమువలెనే మణుల్చిటిలి
        సందులుదేలిన గద్దెనెక్కి కొ
ల్వమరిచెఁ బాదుషా యిరులు
        గ్రక్కెడు నింటికిఁ జిన్నిదీపమై.
సులతాను తల పెఱిఁగెఁ గు
చ్చులపాఁగ హిరణ్య పిత్నశోభితమయి రా
తుల కలకల నవ్వులతోఁ
గలిపి జయారావములనుఁ గట్టులు సేయన్.

తేజుమెరసి యపుడు దిక్కుదిక్కులయందు
రాజపరుఁడు సేసెఁ బ్రకటనంబు
దాను రాజుననుచు ధారుణీతల మెల్ల
శాంతిబొంగె దుఃఖచయము గ్రుంగె.

వచ్చినదంతలోనె నని
        వారణ సైన్యము ఢిల్లికోటలోఁ
జొచ్చిన దామెరల్బలుకు
        సున్నితపుం బయకారిమాటలే

మెచ్చెను జర్మెనో ! యనుజ
సుందరి గుత్తుక యుత్తరింపగాఁ
వచ్చిన దగ్గరి కరి
వాలము లాకసమందు నాడఁగన్.

తనవారనే ఘోర దారిద్ర్యమునకు జీ
వములిచ్చి మానసత్వమును గోసి
తనపోలికనె నియంతలు ధనాఢ్యులు నల్లి
నట్టి యాకతలెల్ల నాత్మనమ్మి
రణభేరికల జయారావములోఁ గనిపించుఁ
గలతెల్ల నిక్కాలల్గాఁగఁ దలఁచి
ధనికనియాశ దీనల రక్తములు దీల్చి
తను పోరునన్న సత్యమ్ము మరచి
తనవతనెఁ గత్తిబూని యుద్ధమున నిలిచి
కొన్న తమ్ముని కంఠమూకొన్న యన్న
నరకెనప్పుడు శోకబంధురిత ప్రకృతి
హృదయమునఁ గోటి ఖడ్గముల్గదలి బొచల.

పడిరి సైనికులప్పు డుగ్గడువుగాఁగఁ
జచ్చుటకె జన్మమెత్తిన జాతివారు

గెలచితిమటంచు దొరలు మిక్కిలి గనలరి
వీచి చేతులు గేకలు వేసినారు.

మహితంబైన స్వతంత్ర భారతము ని
    ర్మాణంబు సేయంగ దు
స్సహ కష్టంబులకోర్చి వీరులయి స్వ
    చ్ఛందంబుగాఁబోరి శ
త్రుహతప్రాణులుగా ధరంబడిన ని
    త్యల్నాకు సాక్షాత్కరిం
త్రు హితాశీస్సులు నింత్రుగాక భవమం
    దున్ భావలోకంబులన్.

పట్టుకొని వచ్చిరపుడు దీప్యత్కిరీట
రహితశిరుఁడైనయట్టి సుల్తాను నటకు
నాడు శిక్షావిశేష కంటక కిరీట
మతని తలయందు- నాయభాగ్యు తలయందు.

కళలుడివోయినట్టి ముది
    గన్నుల బాష్పములూర నూదుపుల్
దళముగఁబార పంచిన శి
    రస్సున నార్చిన దీపమట్లు ని

శ్చలముగ నిల్చెఁ బాదుషహా
    జాతిదొరల్బచరించుఁ గల్ల వి
ద్యల నపరాధిస్థై బొలిచి
    ధైర్యము దాగుడుమూఁత లాడగఁన్.

ప్రబలతరమైన జన్మ ప్రవాసదీక్ష
బడియె సులతాను తలపైని బిడుగుపలెనె
భారతచరిత్రయను వితృపణమునందుఁ
దగులఁబడి పోయెనపుడు స్వాతంత్ర్య శవము

కత్తిగైకొని భారతఖండమెల్ల
నేల గలిగిన సులతాను కాలవశతఁ
గారుచీకటి తోడుగాఁ గారలోనఁ
బడియె బర్మాతలానఁ బ్రవాసియగుచు.

వలపు గులాబిపూల పరు
    వంబు దొలంకెడునట్టి కెంపు బు
గ్గలపయి గంటినీరురలి
    కాలువగట్టఁగ వానకారు కో
యిలవలె నేడ్చెనప్పుడు స
    హింపని దుఃఖము గుండెలాన వి
హ్వలమతియైన "జీనతు మ
    హాల్" గత సౌఖ్యములామతించుచున్,



ఆ రమణీయమూర్తి నవు
డాంగ్లులు బత్తెముదించుచునుండు హి
న్నారలు ఢిల్లిలోనె నిజ
నాథుని కౌగిలిబాసి లద్దుంచు
స్ఫారతరాగ్ని సోకి యెద
భగ్గునమండెను రాణికిన్ యశః
ప్రారభమాణమా మొగలు
రక్తము త్యాగముసేయ బంటునే!

పవళించెను బహదూర్షా
కవితా హృదయంబు దన్నుగవిసిన తొడతో
నవశము సమాధియందున
లివచెడి గాలమున నింక లేపకయుండన్.

గతపతి సమాధిపైననె
పతిగత బహుళాశ విరహపల్లకినిడి యా
సతి నిరతంబునుఁ బాడుచు
నతని గురించి తాను తన్మయత్వము నొందెన్.

భారత చరిత్రయందు సువర్ణ వర్ణ
పంక్తి లిఖియింపఁదగిన విప్లవపుఁ బొంగు
యేవిధి కుచేష్ట వెనుకకు నీడ్చినదియొ
ఆరి దొరలకు నేటి పితూరియయ్యె.



